శ్రీమతే రామానుజాయ నమః



# శ్రీవైష్ణవ సౌభాగ్యమ్

(శ్రీవరవరమునుల స్తుతుల సమాహారం)

*మూలం – మహావిద్వాన్, పద్మవిభూషణ, జగదాచార్య సింహాసనాధిపతి,*

***ఉ.వే.శ్రీమాన్ ప్రతివాదిభయంకరం అణ్ణంగరాచార్య స్వామి వారు***



*ఆంధ్రానువాదం – పండితరత్న,* ***ఉ.వే.శ్రీమాన్ ఈ.ఏ.శింగరాచార్యస్వామి***

శ్రీవరవరమునుల 650వ తిరునక్షత్రోత్సవ స్మారక పవిత్ర జ్ఞాపిక

*21–10–2020*

**శ్రీమతే రామానుజాయ నమః**
**శ్రీమద్వరవరమునయే నమః**

# నివేదనమ్

**ఆచార్యసార్వభౌమోయం రమ్యజామాతృయోగిరాట్ |**
**జయత్వాచంద్రతారార్కం శ్రేయసే న స్సదా భువి ||**

గడచిన శతాబ్దిలో సుమారు 75సంవత్సరాల కాలం భగవద్రామానుజదర్శనానికి, శ్రీవైష్ణవసంప్రదాయానికి సాటి లేని సేవ చేసిన మహనీయులు మహావిద్వాన్, పద్మవిభూషణ, జగదాచార్యసింహాసనాధిపతి **ఉ.వే.శ్రీమాన్ కాంచీ ప్రతివాదిభయంకరం అణ్ణంగరాచార్య స్వామివారు**. సహస్రాధికగ్రంథకర్తలైన వీరిని తెలియని సంస్కృతపండితుడు కాని, శ్రీవైష్ణవుడు కాని ఉండడనేది నిస్సంశయం. ఒకే సమయంలో తమిళం, తెలుగు, హిందీ, ఇంగ్లీషు భాషలలో శ్రీరామానుజమాసపత్రికను నడపి, ఆసేతుహిమాచలం సంప్రదాయప్రచారాన్ని వీరు చేశారు. విశేషించి, ఆళ్వారుల దివ్యప్రబంధాలకు దివ్యార్థదీపిక అనే పేరుతో వీరు రచించిన వ్యాఖ్యానాలు పండితపామరరంజకాలు. సంస్కృతభాషలోకూడా వీరు పలు కృతులను వెలయించారు.

ఆచార్యసార్వభౌములైన శ్రీమణవాళ మహామునుల విషయంలో వీరికి ఉండే భక్తిప్రపత్తులు సాటి లేనివి. వీరి విషయంగా శ్రీ అణ్ణంగరాచార్యస్వామివారు ఎన్నో స్తోత్రాలను సంస్కృతంలో చిత్రకవిత్వప్రక్రియలో రచించారు వాటిని శ్రీవైష్ణవసౌభాగ్యమనే పేరుతో 1943 వ సంవత్సరంలో ముద్రించారు. కొన్నిటికి వారే స్వయంగా తమిళంలో తాత్పర్యాన్ని కూడా వ్రాశారు.

ఈ సంవత్సరం శ్రీమణవాళ మహామునులు అవతరించి 650సంవత్సరాలు పూర్తి కావస్తున్నది. ఈ సందర్భాన్ని పురస్కరించుకొని ఆ ఆచార్యసార్వభౌములకు కృతజ్ఞతాపూర్వకంగా చేసికొనే కైంకర్యరూపంలో శ్రీఅణ్ణంగరాచార్యస్వామివారు అనుగ్రహించిన మణవాళ మహామునుల స్తుతులలో కొన్నిటికి తెలుగుతాత్పర్యంతో అందజేయబడుతున్నవి. ఈ ప్రయత్నాన్ని చేయడానికి ఉదారంగా అనుమతినిచ్చిన సహృదయులు, శ్రీఅణ్ణంగరాచార్యస్వామివారి పౌత్రులు, **ఉ.వే.శ్రీమాన్ రాజహంసమ్** స్వామివారి సన్నిధిలో కృతజ్ఞతాపురస్సరంగా దాసోహసమర్పణను చేసికొంటున్నాను. ఈ ప్రయత్నం సహృదయపాఠకులకు ఆనందాన్ని కలిగిస్తుందని భావిస్తున్నాను.

**పర్యాయభాష్యకార శ్రీరమ్యజామాతృయోగినామ్ |**
**పాదారవిందసవిధే వరివస్యేయమర్ప్యతే ||**

భాగవతదాసుడు
ఈ. ఏ. శింగరాచార్యులు

# విషయ సూచిక

శ్రీమద్వరవరమునయే నమః

# శ్రీమద్వరవరముని వైభవ స్తోత్రమ్

*(శ్రీమద్భిః ప్రతివాది భయంకరం అణ్ణంగరాచార్యవిద్వద్వరేణ్యైః ప్రణీతమ్)*

**శ్రీశైలేశేతిమంత్రస్థవర్ణానుక్రమశోభితమ్ |**
**ఆచార్యసార్వభౌమస్య స్తోత్రం హృద్యం నిగద్యతే ||**

"శ్రీశైలేశదయాపాత్రమ్" అనే తనియన్ శ్లోకంలో ఉండే ముప్పై రెండు అక్షరాలలో ఒక్కొక్క అక్షరాన్ని క్రమంగా ఒక్కొక్క శ్లోకం ఆరంభంలో కూర్చి ఈ స్తుతి రచింపబడుతున్నది (అన్ని శ్లోకాలలోని మొదటి ఆక్షరాలను వరుసగా కలిపితే తనియన్ శ్లోకం వస్తుంది).

**1) శ్రీమద్వరవరమునయే గుణగణనిధయే సదా నతిం కలయే |**
**యత్సూక్తికల్పలతికా కాంక్షితమఖిలార్థ మనుపదం దిశతి ||**

కల్పలతవలె కోరిన ఫలాలను అన్నిటిని వెంటనే ఇవ్వగలిగిన శ్రీసూక్తులను అనుగ్రహించినవారు, అన్ని కల్యాణ గుణాలను కలవారైన మణవాళమహామునులను ఎల్లప్పుడు నమస్కరిస్తున్నాను.

**2) శైల ఇవ సూక్తిసరితాం ఛాయాతరురివ భవార్తిఖిన్నానామ్ |**
**రవిరివ దురధ్వతమసాం వరవరమునివర్య భవాన్ విబభౌ ||**

శ్రీవరవరమునీ! దేవరవారు సూక్తులనే పుణ్యనదులకు పర్వతంవలె ఉత్పత్తిస్థానం. సంసారతాపంవల్ల బాధపడేవారికి చల్లని నీడను ఇచ్చే వృక్షంవంటివారు. చెడ్డ మార్గమనే చీకటిని పోగొట్టే సూర్యునివంటివారు.

**3) లేశోఽపి యస్య సూక్తేః మనసి ధ్యాతోఽత్ర ముదముదంచయతి |**
**సోఽయం వరవరయోగీ సూతే భక్తిం స్వకీయపదపద్మే ||**

తమ శ్రీసూక్తులలోని స్వల్పభాగాన్ని చింతించినా చాలు, ఆనందం పొంగి పొర్లేటట్లుగా వాటిని అనుగ్రహించిన వరవరమునులు తమ శ్రీచరణాలలో భక్తిని కలిగిస్తున్నారు.

**4) శమయతి దురితమశేషం జనయతి పరమం ప్రబోధమిహ యస్య|**
**సూక్తితతిరేష మమ హృది జాగర్తి సదైవ వరవరో యోగీ ||**

దుష్కర్మలను అన్నిటిని పోగొట్టి, మంచి జ్ఞానాన్ని కలిగించే దివ్యసూక్తులను పలికిన మణవాళమహామునులు సదా నా హృదయంలో ప్రకాశిస్తున్నారు.

**5) దయయా నిర్హేతుకయా హరిరిహ సంరక్షతీతి యత్సూక్తిః |**
**విశదయతి మునివరోఽసౌ విలసతి నిర్హేతుకరుణయా హృది మే ||**

భగవానుడు తన నిర్హేతుకకరుణతో మనలను రక్షిస్తున్నాడనే విషయాన్ని స్పష్టం చేసే సూక్తులను అనుగ్రహించే వరవరమునులు నా మనసులో నిర్హేతుకకరుణతో వెలుగుతున్నారు.

**6) యాతు సకలోపి కాలో వరవరయోగీంద్రవివృతసకలార్థే |**
**శ్రీవచనభూషణాఖ్యే దివ్యే శాస్త్రేఽస్య దాసదాసస్య ||**

శ్రీమణవాళమహామునుల వ్యాఖ్యానంతోనే సకలార్థాలను తెలియదగినది అయిన శ్రీవచనభూషణమనే దివ్యశాస్త్రంయొక్క అనుభవంతోనే దాసుడనైన నా కాలమంతా గడవాలి.

**7) పాతు వరయోగివర్యో యో హి రహస్యత్రయార్థమనవద్యమ్ |**
**పావనఫణితిభి రద్భుతసందర్భాభిః ప్రసాదయామాస ||**

రహస్యత్రయార్థవివణరూపంగా శ్రీపిళ్ళైలోకాచార్యులవారు అనుగ్రహించిన ముముక్షుప్పడి అనే గ్రంథాన్ని చాలా అందమైన, పవిత్రమైన దివ్యసూక్తులతో సత్సంప్రదాయానుగుణంగా వ్యాఖ్యానించిన శ్రీమణవాళమహామునులు మనలను కాపాడాలి.

**8) త్రయ్యంతార్థమశేషం లలితసరణ్యైవ బోధయన్ యోఽస్మాన్ |**
**తత్త్వత్రయస్య వివృతిం వరవరయోగీ చకార స గురుర్నః ||**

శ్రీపిళ్ళైలోకాచార్యులవారు అనుగ్రహించిన తత్త్వత్రయమనే రహస్యగ్రంథానికి వ్యాఖ్యానాన్ని కృపజేయడంద్వారా సకలవేదాంతసారార్థాలను సులభమైన రీతిలో వివరించిన మణవాళమహామునులే మన మనస్సులోని అజ్ఞానాన్ని పోగొట్టగల మహాచార్యులు.

**9) ధీరిహ జగతి మదీయా తాస్తా వాచో నిషేవ్య విరమంతీ |**
**వరవరమునీంద్రఫణితిషు దివ్యా మనుభూతి మవిరతాం ధత్తే ||**

ఈ లోకంలో వ్యక్తమైన పలు పలు వాక్కులను సేవించిన (పరిశీలించిన) నా బుద్ధి వానిని వదలి మణవాళమహామునుల దివ్యసూక్తులను అనుభవించడంలో సదా ఆసక్తిని కలిగి ఉన్నది. ("ఎప్పొ(ழுదుమ్ నాళ్ తిజ్గళ్ ఆణ్డు *ழி*యూ *ழி*తొఋమ్ అప్పొ(ழுదైక్కప్పొ(ழுదు ఎన్నారావముదమే" – ఏ సమయంలో అయినా, దినాలు, మాసాలు, ఏళ్ళు అనే విధంగా ఎంతకాలం అనుభవించినా, ఎప్పటికప్పుడు అతృప్తామృతమై శ్రీ వరవరమునుల సూక్తి ఉంటుందని భావం).

**10) భవభయభేషజమతులం విభాతి యత్రోక్త వివృతివిశదార్థమ్ |**
**ఆచార్యహృదయశాస్త్రం స జయతు సౌమ్యోపయంతృ యోగీంద్రః ||**

అ*ழ*కియ మణవాళ ప్పెరుమాళ్ నాయనార్ అనే ఆచార్యవర్యులు అనుగ్రహించినది, జన్మ అనే వ్యాధికి గొప్ప మందు అయిన ఆచార్యహృదయమనే దివ్యశాస్త్రంలోని సకలార్థాలను సువిశదంగా వివరించగలిగిన వ్యాఖ్యానాన్ని కృపజేసిన మణవాళ మహామునులు సర్వోత్కర్షతో వెలగాలి.

**11) భక్త్యా కథయత సతతం వరవరమునివక్త్రదివ్యకమలసుధామ్ |**
**ఉపదేశరత్నమాలాం యయైవ శోభేత భువి సతాం హృదయమ్ ||**

శ్రీవరవరమునుల ముఖారవిందంలోని తేనె అనదగినది, సత్పురుషుల హృదయానికి శోభను (ఆనందాన్ని)కలిగించేది అయిన ఉపదేశరత్నమాల అనే దివ్యశాస్త్రాన్ని ప్రీతితో అనుసంధించండి.

**12) దిశతు మయి దివ్యదృష్టిం ద్రవిడోపనిషన్మహార్థసారం యః**

**శతకేన దివ్యవచసాం ప్రోచే కాంతోపయంతృమునివర్యః**

తిరువాయ్ మొఴి దివ్యప్రబంధంలోని సారార్థాలను తిరువాయ్ మొఴినూఱ్ఱన్దాది అనే దివ్యప్రబంధంద్వారా తెలిపిన శ్రీవరవరమునులు తమ దాసుడనైన నాకు దివ్యదృష్టిని అనుగ్రహించాలి

**13) గురుభిరిహ బహుభిరమితా గిరః ప్రసూతా లసంతి విలసంతు |
సుందరజామాతృమునేః సూక్తిషు మాధుర్యమప్రతిద్వంద్వమ్ ||**

ఈ లోకంలో పలువురు ఆచార్యులు అనుగ్రహించిన సూక్తులు లెక్కలేనివి ఉన్నా, శ్రీవరవరమునుల దివ్యసూక్తులలోని తీయదనం సాటి లేనిది.

**14) గుణలవదరిద్రమేనం దానం వరయోగిగురువరః స్వగిరామ్ |
అర్థమనర్ఘమగాధం పరయా కృపయా ప్రబోధయత్వఖిలమ్ ||**

ఏ యోగ్యత లేని నాకు మణవాళ మహామునుల దివ్యసూక్తులలోని అర్థాలన్నీ చక్కగా ఆ శ్రీవరవరమునుల కృపవల్ల తెలియాలి. (ఈ శ్లోకంలో "ణ"కారం రెండవ అక్షరంగా కూర్చబడింది).

**15) అర్ణవగభీరతామ ప్యహహ! పరిచ్ఛేత్తు మీశతే కతిచిత్ |
వరయోగిసూక్తిసాగరగభీరభావస్తు గోచరో న నృణామ్ ||**

"అప్రమేయో మహోదధిః" అని చెప్పబడే సముద్రంలోని గాంభీర్యాన్ని తెలియగలవారు కొందరు ఉండవచ్చు. కాని, మణవాళమహామునుల

శ్రీసూక్తిసముద్రంలోని లోతును మాత్రం ఎవరూ తెలియలేరు. (ఈ శ్లోకంలో "ర్ణ" అనే అక్షరం రెండవ అక్షరంగా కూర్చబడింది).

**16) వంశే సుమహతి జననం వివేకపుష్టిం శమాదిగుణపూర్తిమ్ |**
**వరయోగిదివ్యసూక్తిష్వద్వేషఫలం ప్రచక్షతే ప్రాజ్ఞాః ||**

శ్రీవరవరమునుల సూక్తులలో భక్తివిశేషం లేకపోయినా, అద్వేషమే కనుక ఉంటే, తత్ఫలంగా మంచి వంశంలో జన్మ, విద్యలలో పూర్ణమైన వివేకం, శమం, దమం మొదలైన సద్గుణాల పూర్తి కలుగుతుందని విజ్ఞులంటారు.

**17) యతిపతిపునరవతారో వరవరమనిరేష ఇతి వినిశ్చేతుమ్ |**
**ఉపపత్తయో హి జాగ్రతి భూయస్య స్తా స్సదా హృదా కలయే ||**

మణవాళ మహామునులు భగవానుని వేఱొక అవతారమని నిశ్చయించుకోవడానికి పలు పలు సాక్ష్యాలున్నందున వాటిని సదా చింతిస్తున్నాను.

**18) తీర్త్వా భవాంబురాశిం యది దివమాసాదయేయమపి తత్ర |**
**కాంతోపయంతృమునివరదివ్యోక్తిసుధైవ భుక్తిరస్తు మమ ||**

జన్మలనే సముద్రాన్ని దాటి, ఒకవేళ పరమపదానికి నేను వెళ్ళినా, అక్కడకూడా మణవాళమహామునుల శ్రీసూక్తి అనే అమృతమే నాకు ఆహారంగా కావాలి.

**19) ద్రవతి దృషదప్యహో! యత్ప్రకథిత యతిరాజవింశతిశ్రవణాత్ |**

**శమదమముఖగుణశేవధి రేష మునిః పాతు వరవరో జగతిమ్||**

విన్నంతలోనే రాళ్ళుకూడా కరిగే రీతిలో ఉండే యతిరాజవింశతి అనే భగవద్రామానుజుల స్తుతిని అనుగ్రహించినవారు, శమదమాదిసద్గుణాలకు నిధి అయిన మణవాళమహామునులు లోకాన్ని రక్షించాలి.

**20) ప్రథయతి యదుదితభగవద్గీతా వ్యాఖ్యానమద్భుతం భావమ్ |**
**కథయతు మమ ముఖమనిశం తస్యైవ మునేః నామాని ||**

భగవద్గీతలోని అద్భుతమైన తాత్పర్యాన్ని స్పష్టంగా తెలుపగలిగిన గీతాతాత్పర్య దీపమనే వ్యాఖ్యానాన్ని అనుగ్రహించిన మణవాళమహామునుల దివ్యనామాలనే నా నోరు సదా అనుసంధించాలి.

**21) వరదాధిరాజమంగళ మభిరామవరో మునీశ్వరో హృద్యమ్ |**
**యః ప్రోవాచ సదా మే వక్త్రం తస్యైవ మంగళం బ్రూతామ్ ||**

శ్రీవరదరాజస్వామి విషయంగా చాలా అందమైన మంగళాశాసనస్తుతిని అనుగ్రహించిన మణవాళమహామునులకే నా వాక్కు మంగళాన్ని నిత్యం పలకాలి.

**22) ప్రవణం హృదయ! సదా భవ వరవరమునివర్యవివృతిమహితాయామ్ |**
**యతిపతిశుభగుణవర్ణనవిచక్షణాయాం ప్రపన్నగాయత్ర్యామ్ ||**

భగవద్రామానుజుల కల్యాణగుణాలను భోగ్యంగా పలుకగలిగినది, శ్రీవరవరమునుల వ్యాఖ్యానంతో మరింత మహత్త్వాన్ని పొందినది అయిన

ఇరామానుశ నూ*ఱ్ఱ*న్దాది ప్రబంధంలోనే, ఓ మనసా! సదా ఆసక్తిని కలిగి ఉండు (ఈ శ్లోకంలో "ఇ"కారం మూడవ అక్షరంగా కూర్చబడింది).

**23) వంచయితు మపీచ్ఛథ జగతీం వరయోగిభక్తిభావనయా ||**
**వంచయత కామమేషా పునాతి సత్యం   ఛలాత్మికాఽపి సతీ ||**

కపటభక్తితో లోకాన్ని వంచించాలని అనుకొన్నా, ఆ కపటభక్తికూడా మణవాళ మహామునుల విషయంలో కలిగి ఉండడం మంచిది.ఎందుకంటే, వరవరమునుల విషయంలో ఏ విధంగా భక్తిభావనను కలిగి ఉన్నా, అది ఆత్మను పవిత్రం చేస్తుంది."పొయ్యే కైమ్మై శొల్లి" అని ఆ*ழ்*వార్లు అన్నారుకదా!

**24) దేయాద్వరవరయోగీ గోదాజనకీయ దివ్యసూక్తితతేః |**
**స్వాత్మకృతవిశదవివృతౌ సుగాఢ మవగాఢ మంతరాత్మానమ్ ||**

మణవాళమహామునులు  పెరియా*ழ்*వార్ తిరుమొ*ழி* ప్రబంధానికి తాము అనుగ్రహించిన భోగ్యమైన వ్యాఖ్యానాన్ని లోతుగా అవగాహించగలిగిన (అర్థం చేసికోగలిగిన) మనసును అనుగ్రహించాలి.

**25) రమయతి మమ మతి మవిరత మాచార్యవరస్య వరవరస్య మునేః |**
**సకలప్రమాణసంగ్రహసమాహ్వయం తత్  ప్రసిద్ధకృతిరత్నమ్ ||**

ఆచార్యసార్వభౌములైన మణవాళ మహామునులు అనుగ్రహించిన సకలప్రమాణసంగ్రహమనే ("ప్రమాణత్తిరట్టు") అనే దివ్యగ్రంథం నా మనసును.ఎల్లప్పుడు సంతోషింపజేస్తున్నది.

**26) య ఇహ వరయోగివర్యః ప్రణినాయార్తిప్రబంధ మార్తిభరాత్ |**
**అపనుదతు సోయ మార్తి  రఖిలా అపి నిత్యమధివసన్ జగతీమ్ ||**

ఈ లోకంలో తాము  ఉండలేని  గొప్ప ఆర్తితో "ఆర్తిప్రబంధమ్"అనే దివ్యప్రబంధాన్ని అనుగ్రహించిన మణవాళ మహామునులు "ఇన్న మొరు నూ*ఱ్ఱా*ణ్డిరుమ్" అనే మంగళాశాసనరీతిలో  ఈ లోకంలో నిత్యం నిలచి ఉండి, మన ఆర్తిని తీర్చాలి.

**27) జాయా జనక సోదర ఇతి తేషు తేషు యః ప్రేమా |**
**ఇహ భవతి సోయమఖిల ▪మద్వర యోగి చరణయోర్మేఽస్తు ||**

భార్య అని, తల్లి అని, తండ్రి అని, సోదరుడని పలువురిపట్ల ఉండే ప్రీతి అంతా నాకు మణవాళమహామునుల శ్రీచరణాలలోనే కలగాలి. సకలవిధబంధువు శ్రీ వర వరమునులే కావాలి.

**28) మాధవ ముకుంద మురహర మధుసూదన కేశవేతి నామోక్తీ |**
**ముక్త్వా కథయతు సతతం వరవరమునినామ మామకం వదనమ్ ||**

నా నోరు "మాధవ! ముకుఃద! మురారీ! మధుసూదన! కేశవ!” అనే భగవన్నామాల సంకీర్తనాన్ని విడచి సదా మణవాళ మహామునుల తిరునామాలనే పలకాలి.

**29) తరలమపి మానసం మే సుందరజామాతృయతిపతేః పదయోః**
**సుదృఢమవగాఢమాస్తే గురువరకరుణా మహౌకథం కథయై**

నా మనసు చంచలమైనది అయినా, మణవాళమహామునుల శ్రీచరణాలలో మాత్రం గాఢంగా, దృఢంగా ప్రీతిని కలిగి ఉన్నది. ఈ విధంగా నన్ననుగ్రహించిన ఆ వరవరమునులను ఏ విధంగా స్తుతించగలను?

**30) రంగీ స్వయమిహ యస్మి న్నంతేవాసీ భవన్ కృతార్థోఽభూత్ |**
**స ఖలు వరయోగివర్యః కథమిహ వర్ణ్యేత మాదృశాం వచసా ||**

శ్రీరంగనాథునికూడా తమ శిష్యునిగా చేసికొన్న మణవాళ మహామునుల మహిమ నావంటి అల్పజ్ఞుల వాక్కుతో వర్ణించడానికి సాధ్యమా!

**31) ముహురిహ వరవరముని వరసూక్తి సుధాస్వాదముదితహృద్రంగీ |**
**దివ్యం యమాహ మంత్రం స సర్వమంత్రాన్ విజిత్య భువి భాతి ||**

మణవాళమహామునుల శ్రీసూక్తి అనే అమృతాన్ని మాటిమాటికి ఆస్వాదించి, మిక్కిలి ఆనందించిన శ్రీరంగనాథుడు స్వయంగా పలికిన "శ్రీశైలేశదయాపాత్రమ్" అనే తనియన్ లోకంలోని సకలమంత్రాలను మించి వెలుగుతున్నది.

**32) నిఖిలాప్యర్చామూర్తిః నిత్యం యన్మంత్రనిగమనాత్తుష్టిమ్ |**
**భజతే వరవరమునివరదైవతమంత్రోఽయ మస్తు మే జప్యః ||**

భగవానుని అర్చామూర్తులందరు మణవాళ మహామునులను అధిదేవతగా కల ఏ "శ్రీశైలేశదయాపాత్రమ్" అనే మంత్రాన్నే ప్రతిదినం ఆలకించి, ఆనందిస్తారో, ఆ మంత్రాన్నే నేను సదా నేను జపిస్తాను.

**33) మహతా శుభకులజనుషా మహనీయాచార్యకరుణయా చ తథా |**
**శ్రీవైష్ణవాంఘ్రిదాసో వరవరయోగిస్తుతిం వ్యజిజ్ఞపత ||**

శ్రీవైష్ణవదాసుడనైన నేను మహనీయుల వంశంలో జన్మించినందున, పెద్దల కృపకు పాత్రమైనందున ఈ స్తుతిని విన్నపించగలిగాను.

----------- శ్రీమద్వరవరముని వైభవ స్తోత్రమ్ సంపూర్ణమ్-----------

శ్రీమద్వరవరమునయే నమః

# శ్రీమద్వరవరముని కర్ణామృతమ్

*(శ్రీమద్భిః ప్రతివాది భయంకరం అణ్ణంగరాచార్యస్వామిభిః ప్రణీతమ్)*

(ఈ స్తుతిలో ఒక్కొక్క శ్లోకంలోని మొదటి అక్షరాలను వరుసగా కలిపితే "వరవరమునిపదకమల జయ" అనే వాక్యం ఏర్పడుతుంది.)

## అవతారిక

భగవద్విషయంలో అభినివేశాన్ని కలవారు "మణివణ్ణా! ఉన్ శేవడి శెవ్వి తిరుక్కాప్పు" అని మంగళాశాసనం చేసినట్లు మణవాళమహామునుల విషయంలో అభినివేశాన్ని కలవారు "వరవరమనిపదకమల జయ" అని మంగళాశాసనం చేయడం యుక్తం కనుక, ఆ వాక్యసన్నివేశంతో అందులో ఉండేఅక్షరాలను క్రమంగా ఒక్కొక్క శ్లోకం మొదట కూర్చి ఈ స్తుతి విన్నపింపబడింది. దీనికి పెద్దలు "శ్రీమద్వరవరమునికర్ణామృతమ్" అనే పేరును పెట్టారు. రసాయన స్తోత్రం వలె ఇదికూడా లఘ్వక్షరాలను అధికంగా కూర్చి రచింపబడింది.

**వరవరమునిపదకమల జయేత్యనుపమ సుమహితచరణమిమమ్ |**
**నిజహృది కలయత తదుపరి విరచితకవనమిదమ్ ||**

"వరవరమునిపదకమలమా! నీవు సర్వోత్కర్షతో ప్రకాశించాలి" అనే అర్థాన్ని ఇచ్చే " వరవరమనిపదకమల జయ" అనే ఈ పాదాన్ని చింతించండి. అంతకుమించి శక్తి ఉంటే ఈ కర్ణామృతాన్ని కంఠస్థం చేయండి.

**1) వరవరమునివర తవ చరణౌ రవిసమమిహ మమ మనసి పరమ్ |**
**సునియత.ముదయత ఇతి వదతో మమ ఖలు జనిరిహ సుఫలవతీ ||**

వరవరమునీ! మీ శ్రీచరణాలు దాసుని మనసులో సదా సూర్యోదయంవలె ప్రకాశిస్తున్నాయి. ఈ విధంగా పలికే నా జన్మ సఫలమైనదికదా!

**1) రవిరిహ ఘనఘనతిమిరతతీః శ్లథయతి బహిరివ న తు హృదయే |**
**గురువర మునివర హృదయగతం మమ ఖలు తదఖిల మపహరసి ||**

మణవాళమహామునీ! సూర్యుడు బయట ఉండే చీకటినిమాత్రం పోగొట్టగలడు తప్ప, మనసులోని చీకటిని (అజ్ఞానాన్ని) పోగొట్టలేడు. దేవరవారు నా మనసులోని చీకటిని అంతటిని పూర్తిగా పోగొడుతున్నారు.

**2) వచసి చ మనసి చ సతతమపి స్వఫణితి మనవధి మతిమధురామ్ |**
**కలయసి మమ వరమునివర భోః! భవభయపరిహృతినిపుణ గురో! ||**

మణవాళ మహామునీ! మీ పరమమధురమైన శ్రీసూక్తులను నా మనసుకు వాక్కుకు రుచించేటట్లు అనుగ్రహించారు. ఇక నేను సంసారాన్ని చూచి భయపడవలసిన అక్కర లేదు.

**4) రఘువరయదువరముఖ భగవత్తనురిహ భువి లసతి పరమ్ |**
**విలసతు మమ ఖలు నయనపథే మునివర! తవ శుభతనురనిశమ్ ||**

మణవాళమహామునీ! ఈలోకంలో శ్రీరామశ్రీకృష్ణాదివిగ్రహాలు ప్రకాశిస్తున్నాయి. అవి ఆ విధంగా ప్రకాశిస్తే ప్రకాశించనీ! కాని, దేవరవారి దివ్యమంగళరూపంమాత్రమే నా కంటికి సదా ప్రకాశించాలి.

**3) మునిరితి గురురితి యతిరితి చ ప్రభజతు యశ ఇహ బహుజనతా |**
**మునిగురుయతిపద మఖిలమపి స్ఫుటగణమిహ వరయమిని పరమ్ ||**

ముని అని, గురువని, యతి అని ఈ లోకంలో పలువురు వ్యవహరింపబడతున్నా ఆ మునిగురుయతిపదాలకు అన్నిటికీ శ్రీవరవరమునుల విషయంలోనే సార్థక్యం మెండుగా ప్రకాశిస్తున్నది.

**4) నిధిమివ నిజహృది నిదధతి యే వరమునివర తవ ఫణితితతిమ్ |**
**బహుజనివిరచిత మఘనివహం క్షణలవవిదళిత మదధత తే ||**

మణవాళమహామునీ! దేవరవారి శ్రీసూక్తులను మనసులో నిధివలె నిలుపుకొని కాపాడుకొనగలిగినవారే పలు జన్మలలో వారు చేసిన పాపాలను అన్నిటిని ఒక్క క్షణంలో పోగొట్టుకోగలరు.

**5) పటుమతిరిహ భువి తవ ఫణితీ రథిముఖ మవిరతమపి కలయన్ |**
**విలసతి యది మునివర తం జితహయముఖ.ఇతి బిరుదముపైత్ ||**

మణవాళ మహామునీ! ఈ లోకంలో వివేకం కలవాడొకడు మీ వ్యాఖ్యానాలను నిరంతరం అనుసంధానం చేస్తే అతడు హయగ్రీవుని కూడా జయించినవాడనే బిరుదును పొందుతాడు.

**6) దమశమముఖగుణజలధిరితి ప్రసృమరశుభతరనిజయశసా |**
**సురభితభువనక మునివర భోఃమమ హృది లిఖ లిఖ తవ ఫణితీః ||**

శమదమాదిదివ్యగుణాలకు సముద్రంవంటివారనే కీర్తితో లోకాన్ని అంతటిని పరిమళింపజేసిన(వ్యాపించిన) మణవాళ మహామునీ! తమ సూక్తులను నా హృదయంలో లిఖించండి.

**7) కలిబల మనుదిన మధికతమం ప్రసరతి బత బత భృశమితి మే |**

**భయలవమపి న హి భజతి మనో వరముని ఫణితిభి రతివిమలమ్ ||**

కలిప్రభావం ప్రతిదినం నాలుగు వైపుల ఎంతగా వ్యాపించినా దానినిగూర్చి నాకు కొంచెంకూడా భయం లేదు.ఎందుకంటే, మణవాళ మహాముునుల శ్రీసూక్తులతో నా మనసు చాలా స్వచ్ఛంగా ఇన్నది కనుక.

**8) మమ మతిరిహ భువి బహుమతిభాక్ విలసతి మునివర శృణు కృపయా | అవిరతమయమిహ తవ ఫణితీః నిజహృది కలయతి నిధివదితి ||**

మణవాళమహాముునీ! నేనెప్పుడూ దేవరవారి శ్రీసూక్తులనే నిధిగా నిలుపుకొన్నాను—అని నా బుద్ధిని పలువురు ప్రశంసిస్తున్నారు.

**11) లసతి హి భువి బహుగురుజనవాక్ ఫలమిహ న కిమపి భవతి తయా | మునివర యది తవ న భవతి గీః ధ్రువమివ సువిపులతిమిరమిహ ||**

మణవాళ మహాముునీ! ఈ లోకంలో ఇంకా పలువురు ఆచార్యుల శ్రీసూక్తులు ప్రకాశిస్తున్నా వాటివల్ల ఏ ప్రయోజనం కనబడలేదు. దేవరవారి శ్రీసూక్తులు అవతరించి ఉండకపోతే లోకంలో అజ్ఞానం నిండి ఉండేది.

**12) జగదిద మనవధిగురుభరితం భవతి హి భవతు చ గురునియుతమ్ | శుభగుణవరవరమునిగురురాడయమిహ నిరుపమగురుపదభాక్ ||**

ఈ లోకంలో లెక్క లేనంతమంది ఆచార్యులు నిండి ఉన్నారు. ఇంకా లక్షలాదిమంది ఆచార్యులు అవతరించనీ. దానివల్ల ఏమి లాభం? మణవాళ మహాముునులొకరే సాటి లేని ఆచార్యులు.

**13) యతిపతిమతమిహ విశదయితుం కృతజనిరిహ భువి వరమునిరాట్ |**
**విలసతి మమ హృది పరమకృపాజలనిధి రవిరత మమితముదా ||**

భగవద్రామానుజసిద్ధాంతాన్ని ఈ లోకంలో ప్రకాశింపజేయడం కోసమే ఈ లౌకంలో అవతరించిన గొప్ప దయాసముద్రమైన మణవాళ మహామునులు దాసుని హృదయంలో ఆనందంగా వేంచేసి ఉన్నారు.

**14) వరవరమునివర! కవనమిదం గుణలవరహితమపి విదుషామ్ |**
**హృది ముద మనవధి ముపజనయేదితి దృఢమహమిద మభిహితవాన్ ||**

మణవాళ మహామునులను గూర్చిన ఈ స్తుతి ఏ గుణాన్ని కలిగినది కాకపోయినా విద్వాంసుల మనసులో మిక్కిలి ఆనందాన్ని కలిగిస్తుంది–అనేది నిజం.

----------- శ్రీమద్వరవరముని కర్ణామృతమ్ సంపూర్ణమ్-----------

శ్రీమద్వరవరమునయే నమః

# శ్రీమద్వరవరముని స్తోత్ర రసాయనమ్

*(శ్రీమద్భిః ప్రతివాది భయంకరం అణ్ణంగరాచార్యవిద్వద్వరేణ్యైః ప్రణీతమ్)*

**శ్రీశైలేశేతిమంత్రస్థవర్ణానుక్రమశోభితమ్**
**లఘ్వక్షరమయం స్తోత్రం రసాయన ముదీర్యతే |**
**దీర్ఘాక్షరప్రవేశోత్ర యస్మాన్న ఘటతే తతః**
**మంత్రస్థదీర్ఘవర్ణానాం హ్రస్వతైవాత్ర సహ్యతామ్ ||**

"శ్రీశైలేశదయాపాత్రమ్" అనే తనియన్ లోని వర్ణాలను క్రమంగా ఒక్కొక్క శ్లోకంలో అమర్చి ఈ స్తుతి రచింపబడింది. అయితే, ఈ స్తుతి లఘు అక్షరాలతో రచించాలనే నియమాన్ని అనుసరించి దీర్ఘాక్షరాలకు బదులుగా లఘువులే కూర్చబడ్డాయి. శ్లోకం అంతా లఘువులనే ప్రయోగించాలనే నియమం ఉన్నా పాదం చివరలో దీర్ఘం ఉండడం విరుద్ధం కాదు.

**1) శ్రితజనివిరచితదురితగణం క్షణలవవిదలిత మకురుత యః |**
**స దిశతి వరవరమునివరగురురాట్ మమ హృది నిజశుభతనుమనిశమ్ ||**

భక్తులు చేసిన పాపాలను అన్నిటిని ఒక క్షణకాలంలోనే నశింపజేసే మణవాళ మహామునులు తమ తిరుమేనిని సదా నా మనస్సులో దర్శింపజేస్తున్నారు.

**2) శమదమముఖశుభగుణజలధే!సువిశద వివరణకరణపటో! |**
**అనుదినమిహ భువి తవ యశసాం తతి మహ మనుభవవిషయ మధామ్ ||**

శమదమాదిగుణాలకు సముద్రంవంటి మణవాళ మహామునీ! చాలా స్పష్టమైన వ్యాఖ్యానాలను అనుగ్రహించడంలో సామర్థ్యం కల స్వామీ! మణవాళ మహామునీ! దాసుడనైన నేను ప్రతిదినం దేవరవారి కీర్తినే నా అనుభవానికి విషయంగా చేసికొన్నాను.

**3) లఘు మయి విరచయ గురుకరుణాం ప్రదిశతి మమ శుభమతి మిహ యా |**
**వరమునివర యది న తవ కృపా మమ జనిరిహ కథముదితఫలా ||**

మణవాళ మహామునీ! దాసునకు మంచి బుద్ధిని కలిగించగలిగిన మీ గొప్ప కరుణను నాపై త్వరగా ప్రసరింపజేయాలి. ఆ కరుణ లభించకపోతే నా జన్మ ఏవిధంగా సార్థకమవుతుంది?

**4) శశధరపరిభవకరవదన! ప్రకలితశుభతరగుణజలధే |**
**శమధనమునివరపరిబృఢ! భోః! ప్రజనయ నను మయి మతిరనఘామ్ ||**

చంద్రుని పరిభవించే అందమైన ముఖాన్ని కల మణవాళ మహామునీ! సద్గుణాలను అన్నిటిని ప్రకాశింపజేసే స్వామీ! శమమనే గుణాన్ని కల యతులలో శ్రేష్ఠా! దాసునకు మంచి బుద్ధి కలిగేటట్లు చేయాలి.

**5) దరదలదనుపమజలజదృశోః నిపతనమయి! మయి కలయ గురో! |**

**ఇదమిహ మయి న హి భవతి యది ధ్రువ మథ మమ జడపరిబృఢతా ||**

మణవాళ మహామునీ! కొంచెం వికసించిన తామరపూలవంటి మీ కటాక్షాలను నాపై ప్రసరింపజేయాలి. ఈ దయ లభించకపోతే, నాకంటే ఇంకొక మూఢుడు ఈ లోకంలో ఉండబోడు.

**6) యతిపతిమతరస మఖిలమపి ప్రథయతి యదుదితవివరణవాక్ |**
**స జయతు వరముని రమితగుణామృత జలనిధిరితి విశదయశాః ||**

తమ వ్యాఖ్యానసూక్తులతో శ్రీరామానుజదర్శనసారార్థాలను అన్నిటిని వివరించినవారు, గొప్ప గుణసముద్రులనే పేరును కలవారైన మణవాళ మహామునులు జయించాలి.

**7) పవనజతరణిజముఖకపిభిస్సహ కృతరఘువరపరిచరణ! |**
**మఘవజిదభిభవకుశలబల!ప్రకటయ మయి తవ పృథుకరుణామ్ ||**

లక్ష్మణునిగా అవతరించి హనుమంతుడు, సుగ్రీవుడు మొదలైన వానరవీరులతో కలసి శ్రీరామునకు కైంకర్యాన్ని చేసిన, ఇంద్రజిత్తును జయించగల బలాన్ని కల ఓ వరవరమునీ! దాసునిపై దేవరవారి గొప్ప దయను చూపాలి.

**8) తనురియమిహ భువి లసతు చిరం గురువర మునివర తవ పదయోః |**
**స్మృతితతిరవిరత మిహ ఘటతే యది మమ తవ శుభతరకృపయా ||**

మణవాళమహామునీ! దేవరవారి కృపవల్ల తమ శ్రీచరణాలలో దాసునకు నిరంతరమైన చింతన కలిగితే ఈ భూలోకంలో దాసుడు చిరంజీవియై ఉంటాడు.

**9) ధియమిహ మనుపమమహిమజుషా వరమునివర! తవ గురుకృపయా |**
**తవ గుణగణనుతికలనవిధౌ అనుకల మనవధి వినిహితవాన్ ||**

మణవాళ మహామునీ! ప్రతినిముషం తమ కల్యాణగుణాలను స్తుతించడంలోనే నా బుద్ధిని అంతటిని ఉపయోగిస్తున్నాను. దేవరవారి కృపయే దీనికి కారణం.

**10) భవమయజలనిధి జఠరగతాం ఘనకృపమునివర బహుజనతామ్ |**
**కరతలవితరణకుశలతయా కలయసి గతశుచ మమితశుభామ్ ||**

గొప్ప దయను కల మణవాళ మహామునీ! జన్మసముద్రంలో పడి క్లేశపడే పలువురు జీవులకు మీరు చేయూతను ఇవ్వగలిగినందున వారికి అందరికి క్లేశం తీరి, ఆనందం పొందేటట్లు చేస్తున్నారు.

**11) యతిపతివిరచితసకలకృతీః మమ హృది లిఖ లిఖ రుచిరమునే! |**
**స చ యతిపతిగురురిహ భవతో న హి ఖలు కథమపి వహతి భిదామ్ ||**

మణవాళ మహామునీ! భగవద్రామానుజులు, దేవరవారు వేరు కానందున, దేవరవారు భగవద్రామానుజులై అవతరించి, అనుగ్రహించిన శ్రీభాష్యాదిగ్రంథాలను అన్నిటిని దాసుని హృదయంలో లిఖించాలి.

**12) దివి భువి విరచయ మమ వసతిం గురువర మమ న హి మనసి భిదా |**
**తవ శుభగుణగణ మనవరతం ప్రకలయ మమ నుతితతివిషయమ్ ||**

మణవాళ మహామునీ! నన్ను స్వర్గానికి తీసికొనిపోయినా, ఈ లోకంలోనే ఉంచినా, నా మనస్సులో తేడా ఏమీ లేదు. సదా దేవరవారి గుణాలనే నా స్తుతులకు విషయంగా చేసికోవాలన్నదే నా కోరిక.

**13) గురువర! శఠరిపుమునివచసాం సువిమలసువిశదహృదయ మహో! |**
**మమ హృది దృఢతరఘటిత మథాః బత!బత! మయి తవ బహులకృపా ||**

మణవాళ మహామునీ! తిరువాయ్ మొ*ழி* దివ్యప్రబంధంలోని గంభీరమైన, అందమైన అర్థాలన్నీ దాసుని మనసులో దృఢంగా నిలచి ఉండేటట్లు చేశారు. దాసుని విషయంలో దేవరవారి కృప చాలా ఘనమైనది.

**14) ప్రణమత వరమునిపదకమలం ప్రవదత వరమునిశుభఫణితిమ్ |**
**కలయత వరమునిపరిచరణం ప్రవిశత సుమహితపరమపదమ్ ||**

లోకులారా! మణవాళమహామునుల శ్రీచరణాలను నమస్కరించండి. వారి శ్రీసూక్తులను చెప్పండి. వారికి కైంకర్యాన్ని చేయండి. ఈ విధంగా చేస్తే పరమపదాన్ని చేరగలరు (ఈ శ్లోకంలో మొదటి అక్షరంగా రావలసిన "ణ"కారం రెండవ అక్షరంగా వచ్చింది).

**15) రచయితు మహమిహ తవ కవనం వరమునివర! హృది న హి కలయే |**
**తదపి చ తవ గుణతతి రఖిలాఽప్యహ మహమితి హృది నటతితమామ్ ||**

మణవాళ మహామునీ! దేవరవారిని స్తుతించాలని నేను నా మనస్సులో అనుకోలేదు. అయినా, మీ గుణాలన్నీ నా మనస్సులో "నేనంటే నేను" అని నాట్యమాడుతున్నందున ఈ విధంగా స్తుతులు ఆవిర్భవించాయి (ఈ శ్లోకంలో "ర్ణ"అనే అక్షరానికి బదులుగా రేఫంమాత్రమే గ్రహింపబడింది).

**16) వచసి చ మనసి చ సతతమపి ప్రథయసి మునివర! తవ సుగుణాన్ |**
**కథమపి న హి ఖలు గురురితరో మమ హృది పదమిహ వినిహితవాన్ ||**

మణవాళ మహామునీ! నా వాక్కులో మనస్సులో సదా తమ కల్యాణగణాలే ప్రకాశించేటట్లు మీరు అనుగ్రహించారు. ఇక వేరు ఏ ఆచార్యులు నా మనస్సులో  పాదం మోపే అవకాశం లేకుండా అయినది.

**17) యశ ఇహ భువి తవ నిరవధికం విలసతి వరమునివర తదిదమ్ |**
**కతిపయకుమతిభి రపలపితం యది కిము హతమిహ నను కథయ ||**

మణవాళమహామునీ! దేవరవారి కీర్తి ఈ లోకంలో అంతటా వ్యాపించి, "మణవాళమామునియే! ఇన్నుమొరు నూ*ఱ్ఱా*ణ్డిరుమ్" అని ప్రతిఇంటిలో, ప్రతివీథిలో  మంగళాశాసనం చేసేటట్లు ప్రకాశిస్తున్నది. ఈ వైభవాన్ని కొందరు కుమతులు నిందిస్తేమాత్రం ఆ కీర్తికి ఏమి లోటు?

**18) తిథిరితి దినమితి భమితి తథాऽయనమితి విచలతి సమయగణే |**
**క్షణమపి గురువర!తవ ఫణితే రనుభవవిరహిత మిహ న సహే ||**

మణవాళమహామునీ! తిథులు, దినాలు, నక్షత్రాలు, అయనాలు అనేవిధంగా గడచిపోయే కాలంలో ఒక్క క్షణం అయినా దేవరవారి దివ్యసూక్తుల అనుభవం లేనిదే నేను ఉండలేను.

**19) ద్రవతి హి మునివర! తవ ఫణితీః ప్రణిదధదవిరతి మమ హృదయమ్ |**
**మితమతి రహమిద మభిహితవాన్ హ్రియమపి బత ! హృది న హి కలయే ||**

మణవాళ మహామునీ! దేవరవారి దివ్యసూక్తులను నిరంతరం అనుసంధించే నా మనస్సు నీటిబుగ్గవలె ద్రవిస్తున్నది. మహాజ్ఞానులు చెప్పదగిన ఈ మాటను అల్పజ్ఞుడనైన నేను చెప్పడానికి కొంచమైనా సిగ్గుపడడం లేదు.

**20) ప్రథయతి వరమునిఫణితి ర్భగవతి శుభగుణగణనిధితామ్ |**
**విలసతు మమ ముఖ ఇయ మనఘా విదలితబహుతమకుమతిమతా ||**

మణవాళమహామునుల వ్యాఖ్యానసూక్తులు భగవానుని కల్యాణగుణాలను వివరించేటట్లే పలు కుదృష్టిసిద్ధాంతాలనుకూడా ఖండిస్తున్నవి. ఇటువంటి శ్రీసూక్తులు వాచోవిధేయం కావాలి.

**21) వపుషి చ వచసి చ మే మునివర! తవ శుభతమవపుషః |**
**ఛవితతి రవిరత మభిలుఠతి ప్రకథయ కథమిద మఘటత మే ||**

మణవాళ మహామునీ! నా దేహంలో, వాక్కులో, మనస్సులో దేవరవారి దివ్యమంగళవిగ్రహకాంతియే నిరంతరం పొరలుతున్నది (వ్యాపిస్తున్నది) ఇటువంటి అదృష్టంనాకు ఏవిధంగా లభించిందో!

**22) నతితతిరథ నుతిశతమథ చ ప్రచలతిసువిశదమననకలా |
మునివర!గురువర! తవ విషయే త్రికరణకృతిరియ మనవధికా ||**

మణవాళ మహాముని! నా మూడు విధాలైన కరణాల వృత్తి దేవరవారి విషయంలోనే ప్రవర్తిస్తున్నది. దేవరవారికి నమస్కరించడం దేహానికి కృత్యం. దేవరవారిని స్తుతించడం వాక్కుకు కర్తవ్యం. దేవరవారిని ధ్యానించడం మనస్సుకు కర్తవ్యం (ఈ శ్లోకంలోని మొదటి అక్షరంగా రావలసిన ణకారానికి బదులుగా నకారం కూర్చబడింది).

**23) వరకవిరితి భువి బిరుదధరో విలసతి బహుబుధజన ఇహ భోః |
వరమునికవిరితి శుభబిరుదం మమ పునరనుపమమతిమహితమ్ ||**

ఈ లోకంలో దైవకటాక్షంతో కవితను చెప్పగలిగిన సామర్థ్యాన్ని పొందిన పలువురు పండితులు వరకవులనే(గొప్ప కవులనే) పేరును పొందారు. కాని, వరమునికవులనే పేరును ఇంతవరకు ఎవరూ పొందలేదు. మణవాళ మహామునులనే నిరంతరం స్తుతించడంవల్ల దాసునకు గొప్పదైన ఆ బిరుదు లభించింది.

**24) దశశతనుతితతిరపి ముఖతో మమ సరభస మనుదిన ముదియాత్ |
వరమునిశుభగుణసురభిరహో! విధురవివిలసితసమ మచలా ||**

మణవాళ మహాముల గుణాలను పొగడాలంటే దాసుని నోటినుండి వేలాది స్తుతులు ప్రతిదినం ఆవిర్భవిస్తూనే ఉంటాయి. అవి సూర్యచంద్రులున్నంతకాలం నిలచి ఉంటాయి.

**25) రమయతి మునివర! మమ హృదయం తవ నిరవధిశుభతనుసుషమా |
అనుభవ మనుపమ మహ మిహ మే కథమివ కథయితు మలమయి భోః ||**

మణవాళ మహాముని! దేవరవారి తిరుమేని అందం దాసుని మనసును రంజింపజేస్తున్నది. సాటి లేని నా ఆ అనుభవాన్ని నేను ఏవిధంగా వివరించగలను?

**26) యతిపతిశఠరిపు భువనగురు ప్రభృతిషు గురుషు చ మహితధియా |
మునివర!నుతిశత మభిహితవాన్ అహమనుశయమిహ బహు కలయే ||**

మణవాళ మహాముని! భగవద్రామానుజుల, నమ్మాళ్వారులు, శ్రీపిళ్ళైలోకాచార్యులవారు మొదలైన ఆచార్యుల విషయంగా గౌరవబుద్ధితో నేను పలు స్తుతులను పూర్వం విన్నపించాను. అయినా, "నేను వానిని అన్నిటిని ఎందుకు చేశాను?" అనే అనుతాపం నాకున్నది.

**27) జగదిద మనవధిసమయగణే సృజతి చ బహుతమగురునివహమ్ |
వరమునిసమగురురుదిత న హీత్యహమిహ సశపథ మభిహితవాన్ ||**

ఈ లోకంలో అనేకకాలాలలో పలు మతాలలో పలువురు ఆచార్యులు అవతరిస్తున్నారు. కాని, మణవాళ మహామునులవంటి ఆచార్యులు ఇంతవరకు ఎవరూ అవతరించలేదని ప్రమాణపూర్వకంగా చెప్పగలను.

**28) మహిమసు మునివర! తవ నిఖిలేష్వపి లఘుకణలవ మనుభవితుమ్ |**

**న హి పటుమతి రహ మహహా! తథాప్యవిరతి తవ శుభకృతిషు రమే ||**

మణవాళ మహామునీ! దేవరవారి మహిమ అనే మహాసముద్రంలోని చాలా చిన్న కణాన్నికూడా నేను అనుభవించగలవాడను కాను. అయినా, నిరంతరంగా దేవరవారి విషయంలో స్తుతులను విన్నపించడంలోనే ఆసక్తిని కలిగి ఉన్నాను.

**29) తరలహృదహమపి వరయమిని క్షణమపి న హి రుచిభరవిరహీ |**
**కరిగిరిపతిమపి వరమునిరాడయమితి మతియుత ఇహ కలయే ||**

నేను చంచలమైన మనసును కలవాడనే అయినా, మణవాళ మహామునుల విషయంలో భక్తి లేకుండా ఒక్క నిముషంకూడా ఉండను. వరదరాజస్వామిని సేవించినా, మణవాళ మహామునులనే భావనతోనే సేవిస్తాను(వరదుడనే నామంలో వరవరమునినామంలోని ఏకదేశాన్ని భావిస్తాను).

**30) రచయతు కవిజన ఇహ బహుళాం కృతితతి మనవధిగుణఘటితామ్ |**
**వరమునిగుణగణకథనపరా మమ ఖలు కృతిరియ మతిశయనీ ||**

ఈ లోకంలో పలువురు కవులు చాలా గొప్పవైన పలు కావ్యాలను రచించవచ్చు. ఎవరు ఏ గ్రంథాన్ని రచించినా, మణవాళ మహామునుల దివ్యగుణాలను స్తుతించే నా కృతియే ఉన్నతంగా ఉంటుంది.

**31) మునివర! తవ శుభతనుమననం మమ హృది విలసత నను సతతమ్ |**
**అత ఇహ భువి మమ సకలమహో! కరతలముపగతమితి సుదృఢమ్ ||**

మణవాళ మహామునీ! దేవరవారి తిరుమేనినిగూర్చిన చింతనయే నా మనసులో సదా ఉన్నందున ఈ లోకంలో నా చేతికి అందనిది ఏదీ లేదు. నేను అవాప్తసమస్తకాముడనైనాను.

**32) నిరవధి నిరుపమ మహిమనిధే! వరమునివర తవ శుభకృపయా |**
**అనుదిన మనుకల ముదయ మియాత్ స్తుతితతి రనవధిగుణభరితా||**

సాటి లేని పలు కల్యాణగుణాలను కల మణవాళ మహామునీ! దేవరవారి అనుగ్రహంవల్ల గుణభరితాలైన ఇటువంటి స్తుతులు ప్రతిదినం ప్రతినిముషం ఆవిర్భవిస్తూనే ఉండాలి.

-----------శ్రీమద్వరవరమునిస్తోత్రరసాయనమ్ సంపూర్ణమ్-----------

శ్రీమద్వరవరమునయే నమః

# శ్రీవరవరముని నక్షత్రమాలా

*(అంతాదిరూపా)*

*(శ్రీమద్భిః ప్రతివాది భయంకరం అణ్ణంగరాచార్యవిద్వద్వరేణ్యైః ప్రణీతమ్)*

**శ్రీమద్వరమునీంద్రార్యస్తుతిం నక్షత్రమాలికామ్ |**
**సాత్త్వికానాం సదా ధ్యేయాం సంతనోమి సతాం ముదే ||**

శ్రీ వరవరమునులను స్తుతించే, నక్షత్రమాలికా రూపమైన, సాత్వికులకు సదా అనుసంధించదగిన స్తోత్రాన్ని ఆనందంగా రచిస్తాను.

**1) శ్రీమాన్ సుందరజామాతృమునిర్జీయాద్యదుక్తయః |**
**అశ్వినాప్యధఃకృత్య చికిత్సాం భువి తన్వతే ||**

"అశ్వినౌ వై దేవానాం భిషజౌ" అని వేదం పలికినట్లు దేవతలకు వైద్యులైన అశ్వినీదేవతలకంటే, తమ శ్రీసూక్తులతో సంసారులకు గొప్ప చికిత్సను చేసే మణవాళ మహామునులకు మంగళమ్ (ఇందులో మొదటి నక్షత్రమైన **"అశ్వినీ"** నక్షత్రం పేరు సూచింపబడింది).

**2) తరుణార్యమజైత్రవపుస్సుషమః కరుణావరుణాలయదివ్యమనాః |**
**వకుళాభరణీయవచోరసికో వరయోగివర శ్శరణం భవినామ్ ||**

తమ దేహకాంతితో సూర్యుని జయించినవారు, కరుణాసముద్రంవంటి మనసును కలవారు, తిరువాయ్ మొ*ழி* ప్రబంధంలోని రస్యాలైన అర్థాలను విశదం చేసినవారైన మణవాళ మహామునులే ముముక్షువులైన సంసారులకు రక్షకం (ఇందులో రెండవ నక్షత్రమైన **"భరణీ"** నక్షత్రం పేరు సూచించబడింది).

**3) నానారుచి ర్జన ఆశ్రయతే ముకుందం**
**స్కందం తథా పశుపతిం ధృతకృత్తికాయమ్ |**
**కామం తథా భజతు రమ్యవరోపయంతృ–**
**యోగీంద్రతోఽన్య మహ మత్ర న భావయేయమ్ ||**

"లోకో భిన్నరుచిః" అని లోకోక్తి. అందువల్ల ముకుందుని కొందరు, షణ్ముఖుని కొందరు, శివుని కొందరు ఆశ్రయించడాన్ని చూస్తున్నాము. వారి వారి అభీష్టానుసారంగా ఎవరినైనా ఆశ్రయించనీ. నేనుమాత్రం మణవాళ మహామునులను తప్ప ఇంకొకరిని ఎవరినీ ఆశ్రయించను (ఇందులో మూడవ నక్షత్రమైన **"కృత్తికా"** నక్షత్రం పేరు సూచింపబడింది)

**4) యత్పాదా వధిరోహిణీ హి భగవత్పాదాబ్జయోః శాశ్వతీః**
**యద్గాత్రం కలశాంబురాశిసుషమా సంస్పర్ధమానర్ధికమ్ |**
**యద్వక్త్రం నిరవద్యశాస్త్ర నిచయోదంచన్మహాసౌరభం**
**సోయం భాతి వరోపయంతృమునిరాట్ చిత్తే మదీయేఽనిశమ్ ||**

దాసుని మనస్సులో ఎల్లప్పుడు వేంచేసి ఉండే మణవాళ మహామునుల శ్రీచరణాలు–భగవానుని పాదకమలాలను చేర్చే నిచ్చెనవంటివి. వారి తిరుమేనికాంతి పాలసముద్రంతో పోటీ పడగలిగినది. వారి ముఖం సకలశాస్త్రసారార్థాలతో పరిమళిస్తుంది (ఇందులో నాలుగవ నక్షత్రమైన **"రోహిణీ"** నక్షత్రం పేరు సూచింపబడింది).

**5) శశాదిమృగశీర్షకేష్వపి భవేద్విషాణం క్వచిత్
నభస్యపి కదాచనోద్భవ మియాచ్చ పంకేరుహమ్ |
న జాతుచిదహో! భవేద్వరవరస్య యోగీశితుః
గభీరమధురోక్తిషు ధ్రువమవద్యశంకాంకురః ||**

సహజంగా కొమ్ములు లేని  కుందేళ్ళు మొదలైన కొన్ని మృగాల తలలపై కొమ్ములు మొలిస్తే మొలువవచ్చు, ఆకాశంలో తామరపూవు ఒకవేళ పూస్తే పూయవచ్చు.ఈ విధంగా అసంభావితాలు సంభవిస్తే సంభవించవచ్చు. కాని, మణవాళ మహామునుల గంభీరమైన, మధురమైన శ్రీసూక్తులలో ఎక్కడా దోషశంకకు అవకాశం లేదనేది నిశ్చయం (ఇందులో అయిదవ నక్షత్రమైన "**మృగశీర్షా"** నక్షత్రంపేరు సూచింపబడింది).

**6) రమ్యవరయోగివరసూక్తిరససేకైః
సంతతమిహాస్తు మమ సాధు రసనాఽర్ద్రా |
యే ఖలు పవిత్రతమగాంగజలసేకాన్
అప్యహహ!మందయితుమత్ర భువి శక్తాః ||**

పరమపవిత్రమైన గంగాజలసేకాన్నికూడా తక్కువజేయగలిగిన మణవాళ మహామునుల శ్రీసూక్తిరసప్రవాహంతో నా నాలుక సదా ఆర్ద్రమై ఉండాలి (ఈ శ్లోకంలో ఆరవ నక్షత్రమైన **"ఆర్ద్ర"** పేరు సూచింపబడింది).

**7) తాత స్సర్వజనీన ఏష భగవాన్ మా నామ మాం రక్షతాత్**
**నైర్ఘృణ్యేన పునఃపున ర్వసుమతీకోణేఽత్ర కామం క్షిపేత్ |**
**ఏతత్కేవల మర్థయే మురరిపుం శ్రీరమ్యజామాతరి**
**స్వామిన్యద్భుతభక్తిభూషితహృదాం వంశే సముత్పాదయ ||**

సర్వలోకపిత అయిన భగవానుడు నన్ను రక్షించనక్కరలేదు. మనస్సులో దయ లేకుండా ఇంకా ఇంకా ఈ సంసారంలో నే తోసివేస్తే తోసివేయనీ. ఆ భగవానుని నేను ఒక్కటే ప్రార్థిస్తాను. అది ఏమంటే—మణవాళ మహామునుల విషయంలో భక్తిని కల మహనీయుల వంశంలోనే నాకు జన్మ కలగాలి—అని మాత్రమే అర్థిస్తాను (ఈ శ్లోకంలో ఏడవ నక్షత్రమైన **"పునర్వసు"** పేరు సూచింపబడింది).

**8) యతస్వ నను సంతతం వరమునీంద్రదివ్యోక్తిభిః**
**సుధారససరీతిభి ర్గమయితుం నిజం జీవితమ్ |**
**ఇతీహ సుబహుర్జనో గురువరోపదిష్టోఽప్యహో!,**
**యతిష్య ఇతి కేవలం ప్రతివదన్ భవే భ్రామ్యతి ||**

"మణవాళ మహామునుల అమృతంవంటి సూక్తులతోనే నిత్యకాలక్షేపం చేయండి" అని పెద్దలు పలువురికి ఉపదేశిస్తున్నా, "ప్రయత్నిస్తాను" అని మాత్రం బదులు పలుకుతున్నారు తప్ప, ఆ విధంగా

మణవాళ మహామునుల సూక్తులతో కాలక్షేపం చేయడం లేదే! అయ్యో! (ఈ శ్లోకంలో ఎనిమిదవ నక్షత్రమైన **"పుష్యమి"** పేరు **"తిష్య"** శబ్దంతో సూచింపబడింది).

**9) తిరస్కృత్య ప్రాచా మతిమధురసందేశ మనఘం**
**పలాయద్వే భోః! భోః! పిశితవపురాశ్లేషకుతుకాత్ |**
**అమందానానందాన్ సృజతి వరయోగీంద్రఫణితి–**
**ప్రవాహే స్వాదిష్ఠే ఘటయత సకృద్వాపి రసనామ్ ||**

పెద్దలు చేసే మధురమైన ఉపదేశాలను ఆదరించకుండా, మాంసమయమైన శరీరంతో కలిగే సంశ్లేషంలోని ఆశతో అటు ఇటు పరిభ్రమించే లోకులారా! మహానందాన్ని ఇచ్చే మణవాళ మహామునుల దివ్యసూక్త్యమృత ప్రవాహంలో ఒక్క నిముషమైనా తడవాలని మీరు అనుకోకూడదా! (ఇందులో తొమ్మిదవ నక్షత్రమైన **"ఆశ్లేషా"** నక్షత్రం పేరు సూచించబడింది).

**10) నార్హత్యేవాత్ర నూనం హరిరపి భవినాం మాదృశానా మఘాని**
**ప్రోద్ధర్తుం దైత్యరక్షోగణదళనకలామాత్రదక్షో హి సోఽభూత్ |**
**ఏక స్సర్వజ్ఞచూడామణి రనఘగుణో రమ్యజామాతృయోగీ**
**దివ్యశ్రీసూక్తితేజోవితతిభి రతనోత్ ద్రాగఘధ్వాంతశాంతిమ్ ||**

నావంటివారి పాపాలను పోగొట్టడానికి భగవానునకుకూడాసాధ్యం కాదు. అతడు అసురులను, రాక్షసులను సంహరించడంలో మాత్రమే నిపుణుడు. సర్వజ్ఞులైన మణవాళ మహామునులొక్కరే తమ దివ్యసూక్తులనే

తేజఃపుంజాలద్వారా పాపాలనే చీకటిని పారదోలారు (ఈ శ్లోకంలో పదవ నక్షత్రమైన "**మఘా**" నక్షత్రం సూచింపబడింది).

**11) శాంతం కర్తుం సంసృతిరోగం స్పృహయంతః**
**పూర్వే ఫల్గున్యౌషధవర్గే హతతృష్ణాః |**
**యత్సూక్త్యోఘే దివ్యమహాభేషజబుద్ధిం**
**భేజు స్సోఽయం పాతు సదా మాం వరయోగీ ||**

సంసారమనే వ్యాధిని పోగొట్టుకోవాలని తలచిన పెద్దలు అల్పమైన ఔషధాలలో కోరిక లేనివారై, మణవాళ మహాముసుల శ్రీసూక్తులనే దానికి తగిన మందుగా గ్రహించారు. ఆ వరవరమునులు నన్ను రక్షించాలి (ఇందులో పదకొండవ నక్షత్రమైన "**పూర్వఫల్గుని**" పేరు సూచింపబడింది. "**పూర్వే ఫల్గుని**" అనేది వైదికమైన నిర్దేశం).

**12) గీరేషా మమ ధన్యభావ మతులం ధత్తే స్మ యస్మాదహో**
**దౌర్భాగ్యోత్తరఫల్గునీచజనతాస్తోత్రే విరక్తిం గతా |**
**శ్రీమద్రమ్యవరోపయంతృయమినః శ్రీసూక్తిసౌవాదవం**
**నిస్సీమాద్భుతవైభవం ప్రతికలం స్తోతుం సముజ్జృంభతే ||**

నా వాక్కు చాలా కృతార్థమైనది. ఎందుకంటే–మిక్కిలి దౌర్భాగ్యాన్ని కలిగిన అసార–అల్పజనులను స్తుతించడం విడచిపెట్టి మణవాళ మహామునుల శ్రీసూక్తిమాధుర్యాన్నే స్తుతిస్తున్నాను కనుక (ఇందులో పన్నెండవ నక్షత్రమైన "**ఉత్తరఫల్గుని**" పేరు సూచింపబడింది)

**13) తే తే సంతు పరస్సహస్రఫణితిస్తోమాః ప్రణీతాః పరైః**

**కిం తే శ్రీవరయోగితల్లజవచస్సేకేన దధ్యుస్తులామ్ |**
**శ్రీరంగేశ్వరసంప్రకాశిత మహామాహాత్మ్య సింధో ర్గురోః**
**అస్త్యేకాం ఫణితిం ముఖే కలయతాం హస్తస్థితో మాధవః ||**

ఇతరులు పలికిన పలు వేల వాక్కులుండనీ. అవి అన్నీ కలసినా మణవాళ మహామునుల ఒక్క శ్రీసూక్తితో సరిపోతాయా? శ్రీరంగనాథునివల్ల లోకంలో ప్రసిద్ధమైన గొప్పమహిమ కల ఈ వరవరమునుల ఒక సూక్తిని అయినా అనుసంధించగలిగినవారికి భగవానుడు స్వాధీనమవుతాడు (ఇందులో పదమూడవ నక్షత్రమైన **"హస్త"** పేరు సూచింపబడింది).

**14) వరవరమునివర్యపాదాబ్జయుగ్మైక్య సంబంధినాం**
**జనిమృతిభవభీతివైదేశికత్వం తు నిశ్చప్రచమ్ |**
**ప్రతిజని యది తత్పాదాబ్జైకసంబంధసంపద్ ధ్రువా**
**జనితతిరతిమాత్రచిత్రాఽపి మాం కామమాసీదతు ||**

మణవాళ మహామునుల శ్రీచరణసంబంధం పొందినవారికి జన్మమృత్యువులు కలుగవు అనేది నిశ్చయం. అయినా, ప్రతిజన్మలోను మణవాళ మహామునుల శ్రీచరణసంబంధమనే సంపదయే తప్పక లభిస్తే పలు విచిత్రమైన జన్మలు కలగాలి. (ఇందులో పద్నాల్గవ నక్షత్రమైన **"చిత్ర"** పేరు సూచింపబడింది).

**15) తులాయాం మూలర్ క్షే సకలజన సౌభాగ్యవిభవాత్**
**విభూత్యామేతస్యాం సముదిత యతీంద్రప్రవణ! నః |**
**క్షమస్వాతీతానాం సముదయమఘానా మథ పునః**
**మనో వాచం కాయం ప్రవణయ భవత్సూక్తినివహే ||**

లోకం చేసికొన్న అదృష్టంవల్ల అల్పిశిమాసం (ఆశ్వయుజమాసం) ములానక్షత్రంలో ఈ లోకంలో అవతరించిన మణవాళ మహామునీ! ఇంతవరకు మేము చేసిన దోషాలను క్షమించండి. ఇకపై ఏ దోషం సంభవించని విధంగా మా మనోవాక్కాయాలను దేవరవారి శ్రీసూక్తులలోనే ఆసక్తిని కలిగి ఉండేటట్లు దేవరవారే అనుగ్రహించాలి (ఇందులో పదిహేనవ నక్షత్రమైన **"స్వాతీ"** నక్షత్రంపేరు సూచింపబడింది)

**16) హరిరిహ భువి రంగధామా స్వయం రమ్యయోగీశ్వరాత్**
**ఉపనిషదనుధావిశాఖాసహస్రం శఠారీరితమ్ |**
**సహుగురువరభాష్యసారార్థసందోహసంధుక్షితం**
**నిజహృది వినిధిత్సు రాత్మాన మాధత్త శిష్యోత్తరమ్ ||**

శ్రీరంగనాథుడు ఉపనిషత్తులకు సమానమైన (సహస్రశాఖోపనిషత్సమానమైన) తిరువాయ్ మొழிని అనేక వ్యాఖ్యాన విశేషార్థాలతో ఆలకించగోరి, మణవాళ మహామునులకు శిష్యునిగా తనను చేసికొన్నాడు (ఈ శ్లోకంలో పదహారవ నక్షత్రమైన **"విశాఖా"** నక్షత్రం పేరు సూచింపబడింది).

**17) మహీయాన్ యోగీంద్ర స్స ఖలు మనురాధాతు మవనౌ**
**ప్రతిష్ఠాం ధర్మాణాం యదవదత తద్భేషజమితి |**
**శ్రుతిర్భూతాం కామం వరవరమునీంద్రోక్తినికరాత్**
**ప్రశంసంతి ప్రాజ్ఞాః కిమపి న పరం భేషజవరమ్ ||**

"మనువు అనే మహర్షి ధర్మస్థాపనకోసం చెప్పినది అంతా మందు" అని "యద్వై కించిత్ మనురవదత్ తద్భేషజమ్" అనే వాక్యంతో వేదం తెలిపింది. అయినా, మణవాళ మహాముునుల దివ్యసూక్తులకు మించిన గొప్ప మందు వేరొకటి ఉన్నదని ప్రాజ్ఞులు ప్రశంసించరు (ఇందులో పదిహేడవ నక్షత్రమైన **"అనూరాధా"** నక్షత్రంపేరు సూచింపబడింది).

**18) రంగాధీశ్వరగీతపద్యవిశదఖ్యాతే ర్మహాయోగినః**
**పాదాబ్జాశ్రితశిష్యశిష్యపదయోః సేవాఽప్యలం శ్రేయసే |**
**ఏవం సత్యపి హంత! యేఽత్ర విముఖాః గుర్వంతరాన్వేషిణః**
**తే జ్యేష్ఠాసవిధాత్ సుసంపదమిహ ప్రేప్సోర్జనస్యాగ్రజాః ||**

శ్రీరంగనాథుడు పలికిన "శ్రీశైలేశ" ఇత్యాది తనియన్ శ్లోకంతో జగద్విఖ్యాతులైన కీర్తిని కల మణవాళ మహామునులను నేరుగా సేవించలేకపోయినా వారి సంబంధసంబంధసంబంధులను ఆశ్రయించినా ఉజ్జీవించడంలో లోటు లేదు. వాస్తవం ఈ విధంగా ఉన్నా, శ్రీవరవరమునుల విషయంలో విముఖులై, ఇంకొక ఆచార్యులను వెదకేవారు జ్యేష్ఠాదేవివద్ద గొప్ప సంపదను పొందాలని కోరేవారికి అన్నగారే (ఈ శ్లోకంలో పద్దెనిమిదవ నక్షత్రమైన **"జ్యేష్ఠా"** నక్షత్రంపేరు సూచింపబడింది).

**19) జన్మశుద్ధవైష్ణవార్హ్యమానసోద్యదప్రమేయమోదమూలం**
**అద్వితీయభక్తియుక్తదివ్యసూరిసూక్తితత్త్వబోధమూలమ్ |**
**లక్ష్మణార్యదర్శనీయనిస్తులార్థరత్నరాశిజీవమూలం**
**అత్ర సుందరోపయంతృయోగివర్య నిస్తులావతారమూలమ్ ||**

మణవాళ మహామునులవతరించిన మూలానక్షత్రం –సహజంగానే పవిత్రులైన శ్రీవైష్ణవుల మనస్సులో కలిగే ఆనందానికి మూలం, గొప్ప భక్తులైన దివ్యసూరుల సూక్తులలోని యథార్థతత్త్వాలను గ్రహించడానికి మూలం, భగవద్రామానుజుల దర్శనంలోని గంభీరమైన, గొప్ప అర్థాలను తెలియడానికి మూలం (ఇందులో పందొమ్మిదవ నక్షత్రమైన **“మూలా”** నక్షత్రం పేరు సూచింపబడింది).

**20) మూర్తి రపూర్వాషాఢస్ఫుటశోభా**
**వామనరూపా యా బలిచిత్తం హరతిస్మ |**
**సా తు మదగ్రే తిష్ఠతు కామం న హి సా మే**
**హర్తుమలం హృద్రమ్యమునీంద్రప్రతిపన్నమ్ ||**

పాలాశదండాన్ని చేతిలో ధరించిన, అందమైన, అపూర్వమైన వామనరూపం నా మహాబలి చిత్తాన్ని అపహరించింది. ఆ మూర్తి నా కంటిముందు ప్రత్యక్షమైనా మణవాళ మహామునులపట్ల ఆసక్తమైన నా మనస్సు ను అది ఆకర్షించలేదు. (అపూర్వా, ఆషాఢగృహీతి అని పదవిభాగం. పలాశ దండానికి ఆషాఢమని పేరు. ముందు శ్లోకంలోని చివరలో ఉండే లకారానికి తరువాత ఉన్న మకారం ఈ శ్లోకం మొదట వచ్చింది. కనుక అందాదినియమంలో భంగం లేదు. ఇందులో ఇరవైయవ నక్షత్రమైన **“పూర్వాషాఢా”** నక్షత్రం పేరు సూచింపబడింది.)

**21) నాసహంత యదహో తదషాఢా**
**ఇత్యదశ్శ్రుతివచోనుగుణం యే |**
**రమ్యయోగివిభవాన్న సహంతే**
**తానషాఢపదతః కథయేయమ్ ||**

యజుర్వేదంలో ప్రథమాష్టకం పంచమప్రశ్నలో నక్షత్రనామాలకు నిర్వచనం చెప్పబడింది. అక్కడ "యన్నాసహంత తదషాఢా" అని చెప్పబడింది. ఇతరుల ఉన్నతిని సహించనివారికి "అషాఢా" అని అక్కడ తెలుపబడింది. అంటే—అసూయ కలవారని అర్థం. ఈ శ్రుత్యనుసారం మణవాళ మహామునుల వైభవంపట్ల అసూయ కలవారు అషాఢశబ్దవాచ్యులు (ఈ శ్లోకంలో **"అషాఢ"** పదం రెండు సార్లు ప్రయోగింపబడడం ఉత్తరాషాఢకు గమకం).

**22) యన్మంత్రశ్రవణకుతూహలం ధరిత్ర్యా**
**మర్చామూర్తిషు నిఖిలాసు నిత్యమింధే |**
**సోయం శ్రీవరవరయోగిదైవమంత్ర**
**స్సర్వేషామలమిహ చిత్తశోధనాయ ||**

మణవాళ మహామునుల తనియన్ ను ఆలకించాలని సమస్తదివ్యదేశాలలోని అర్చామూర్తులు కుతూహలాన్ని కలిగి ఉండడాన్ని తెలిస్తే వాస్తవం వ్యక్తమవు తుంది (ఇందులో ఇరవై రెండవ నక్షత్రమైన **"శ్రవణా"** నక్షత్రంపేరు సూచింపబడింది).

**23) యతిపతిపదపద్మసంబంధనిష్ఠాగరిష్ఠాత్మనామ్**
**అపి వరయోగిపాదారవిందానుబంధో న చేత్ |**
**న భవతి గతిరుత్తమేతి ప్రతీత్యా మహాంతః పురా**
**వరమునిపదపద్మ మాశ్రిత్య సంప్రాపు రుజ్జీవనమ్ ||**

భగవద్రామానుజుల సంబంధం పొందినవారికికూడా మణవాళ మహామునుల శ్రీచరణసంబంధం లేకపోతే ఉత్తమగతి లేదు—అని నమ్మిన

పూర్వులు మణవాళ మహాముసుల శ్రీచరణాలను ఆశ్రయించి, ఉజ్జీవించారు (ఇందులో ఇరవై మూడవ నక్షత్రమైన **"ధనిష్ఠా"** నక్షత్రంపేరు సూచింపబడింది).

**24) నరజని ముపయాతా నిత్యరోగోపమర్దాః**
**దశశతభిషగంఘ్రీన్ సంశ్రయంతో భ్రమంతి |**
**అహమిహ వరయోగిశ్రీపదాంభోజరేణూన్**
**హృది కలయితుమిచ్ఛన్ సర్వరోగైర్విముచ్యై ||**

మానవులై జన్మించినవారు నిత్యం రోగాలతో బాధపడుతూ వేలాదిమంది వైద్యులను ఆశ్రయించి క్లేశపడుతు న్నారు. నేనయితే, మణవాళ మహాముసుల శ్రీచరణరేణువులను మనసులో ధరించాలని తలచినంతనే అన్ని రోగాలనుండి  విముక్తుడ నయ్యాను (ఇందులో ఇరవై నాల్గవ నక్షత్రమైన **"శతభిషక్"** నక్షత్రం పేరు సూచింపబడింది).

**25) యే ఽపూర్వభద్రపదవీ మిహ లబ్ధుకామాః**
**తే రమ్యయోగిపదభక్తసమీహితార్థాన్ |**
**సంసాధయేయురిహ చేదథ తైస్తు సద్యః**
**ప్రాప్యేత సేతి విశయోఽత్ర న జాతు లోకే ||**

ఈ లోకంలో అధికారస్థానాలలో గొప్ప పదవులను పొందాలని కోరుకొనేవారు మణవాళ మహాముసుల భక్తులకు మంచిని చేస్తే వెంటనే వారు కోరుకొన్న పదవులను పొందగలరనేది నిశ్చయం (ఇందులో ఇరవై అయిదవ నక్షత్రమైన **"పూర్వభద్ర"** పేరు సూచింపబడింది).

**26) లోకోత్తరభద్రపదస్థిత మప్యుత్సృజ్య చిరం వరయోగిగురోః |**

**సద్భక్తగృహాంగణకింకరతాం దాసో ముహు రిచ్ఛతి లబ్ధుమసౌ||**

లోకోత్తరమైన, మంగళకరమైన పదవి లభించినా దానిని విడచిపెట్టి, మణవాళ మహామునుల భక్తుల గృహాలలో కైంకర్యం చేయడానికే నేను ఇష్టపడతాను (ఇందులో ఇరవై ఆరవ నక్షత్రమైన **"ఉత్తరభద్ర"** పేరు సూచింపబడింది).

**27) సౌమిత్రిరేవతీశౌ శ్రీరామానుజవరోపయంతృమునీ |**
**ఇత్యవతారాం శ్చతురః చతురః కృతవాన్ ఫణీంద్ర ఏవ పరమ్ ||**

లక్ష్మణుడు, బలరాముడు, భగవద్రామానుజులు, మణవాళ మహామునులు–అనే నాలుగు అవతారాలను ఎత్తిన ఆదిశేషులే చతురులు (ఇందులో చివరి నక్షత్రమైన **"రేవతి"** పేరు సూచింపబడింది).

**నక్షత్రమాలాం వరయోగివర్యప్రభావ సంకీర్తనసంప్రవీణామ్ |**
**నిత్యం ముఖే బిభ్రతి యే మహాంతః తే తారకాధీశవదుజ్జ్వలేయుః ||**

శ్రీమణవాళ మహామనుల వైభవాన్ని వర్ణించగల ఈ నక్షత్రమాలికాస్తుతిని నిత్యం అనుసంధించే మహనీయులు నక్షత్రాలకు నాథుడైన చంద్రునివలె గొప్పగా ప్రకాశిస్తారు.

------------శ్రీమద్వరవరమునినక్షత్రమాల సంపూర్ణమ్-------------

శ్రీమద్వరవరమునయే నమః

# శ్రీశైలేశదయాపాత్ర మంగళాశాసనమ్

*(శ్రీమద్భిః ప్రతివాది భయంకరం అణ్ణంగరాచార్యవిద్వద్వరేణ్యైః ప్రణీతమ్)*

**శ్రీశైలేశేతిమంత్రస్థ వర్ణానుక్రమశోభితమ్ |**
**వచ్మి విద్వన్మనోహారి వరయోగీంద్రమంగళమ్ ||**

"శ్రీశైలేశదయాపాత్రమ్" ఇత్యాది తనియన్ శ్లోకంలోని వర్ణాల క్రమంలో పండితుల మనసును రంజింపజేసే మణవాళ మహామునుల మంగళాశాసనస్తుతిని విన్నపిస్తాను.

**1) శ్రీశఠారియతీశానశ్రీసూక్త్యమృతపాయినే |**
**శ్రీమత్సుందరజామాతృమునీంద్రాయాస్తు మంగళమ్ ||**

నమ్మాళ్వార్ల, భగవద్రామానుజుల శ్రీసూక్తులనే అమృతాన్ని పానం చేసే మణవాళ మహామునులకు మంగళమ్.

**2) శైశవాత్ప్రభృతి శ్రీమన్నారాయణ గుణాంబుధౌ |**
**నిమగ్నహృదయాయాస్తు మునివర్యాయ మంగళమ్ ||**

చిన్నతనంనుండే భగవద్గుణసముద్రంలో అవగాహించిన వరవరమునులకు మంగళమ్.

**3) లేఖనే విశదవ్యాఖ్యానిబంధానాం పటీయసే |**
**లేలిహానేంద్రరూపాయ మునీంద్రాయాస్తు మంగళమ్ ||**

మిక్కిలి స్పష్టమైన వ్యాఖ్యానాలను అనుగ్రహించగలిగిన మణవాళ మహామునులకు మంగళమ్.

**4) శఠారిపరకాలాదిదివ్యసూరిసుధోక్తిభిః |**
**సౌరభాంచితవక్త్రాయ సౌమ్యాచార్యాయ మంగళమ్ ||**

నమ్మాళ్వార్ల, తిరుమంగై ఆళ్వార్ల సూక్తులు పరిమళించే ముఖాన్ని కల మణవాళ మహామునులకు మంగళమ్.

**5) దయాపాలమునీంద్రోక్తదివ్యగ్రంథార్థవర్షిణే |**
**దయాబ్ధయే మునీంద్రాయ దాంతశ్రేష్ఠాయ మంగళమ్ ||**

"అరుళాళప్పెరుమాళ్ ఎంబెరుమానార్" అనుగ్రహించిన జ్ఞానసార, ప్రమేయసారాలనే ప్రబంధాలకు వ్యాఖ్యానాలను అనుగ్రహించిన మణవాళ మహాములకు మంగళమ్.

**6) యాతాయాతశ్రమం ఘోరసంసారమరు కాననే |**
**లుంపతే రమ్యజామాతృమునివర్యాయ మంగళమ్ ||**

సంసారమనే ఎడారిలో మనం పరిభ్రమించకుండా కాపాడిన మణవాళ మహాములకు మంగళమ్

**7) పాదాబ్జప్రవణాన్నిత్యం పాదాంభోరుహపాథసా |**
**పునతే పుణ్యయశసే పూజ్యశ్రేష్ఠాయ మంగళమ్ ||**

తమ పాదాలను ఆశ్రయించినవారికి నిత్యం శ్రీపాదతీర్థాన్ని అనుగ్రహించే మణవాళ మహాములకు మంగళమ్.

**8) త్రయ్యంతార్థానశేషేణ తత్త్వత్రితయటీకయా |**
**వివృణ్వతే యతీంద్రాయ మహతే నిత్యమంగళమ్ ||**

తత్త్వత్రయవ్యాఖ్యానంద్వారా వేదాంతార్థాలను వివరించిన మణవాళ మహాములకు మంగళమ్.

**9) ధీమద్భి ర్వరదార్యాదిగురుభి స్సేవితాంఘ్రయే |**
**ధీరాయ రమ్యజామాతృమునీంద్రాయాస్తు మంగళమ్ ||**

కోయిలణ్ణన్ మొదలైన మహనీయులచే సేవింపబడే మహాధీరులైన మణవాళ మహామునులకు మంగళమ్.

**10) భయం భవాబ్ధిమగ్నానాం సమున్మూలయతే సతామ్ |**
**భవ్యాయ రమ్యజామాతృమునయే నిత్యమంగళమ్ ||**

జన్మసముద్రంలో మునిగినవారి భయాన్ని తీర్చే మణవాళ మహామునులకు మంగళమ్.

**11) యాతానాం నరకేస్మాకం యః కృపాంబుధి రచ్ఛినత్ |**
**యతీంద్రప్రవణాయాస్మై మునీంద్రాయాస్తు మంగళమ్ ||**

నరకంలో కలిగే వేదన ఏదీ మనకు కలుగకుండా ఉండేటట్లు కృపజేసిన మణవాళ మహామునులకు మంగళమ్.

**12) దివ్యసూక్తిసుధాస్వాదప్రఫుల్లమనసే సదా |**
**దివ్యామలముఖాయాస్తు దేశికేంద్రాయమంగళమ్ ||**

ఆళ్వారుల దివ్యసూక్తులనే అమృతాన్ని పానం చేసి, వికసించిన మనస్సును కల మణవాళ మహామునులకు మంగళమ్.

**13) గురూణామప్యశేషాణా మగ్రగణ్యాయ యోగినే |**
**గుహ్యానా మర్థతత్త్వానాం నిధయే నిత్యమంగళమ్ ||**

ఆచార్యులందరికంటే ముందుగా భావించదగినవారు, రహస్యార్థతత్త్వనిధి అయిన మణవాళ మహామునులకు మంగళమ్

**14) గుణానా మప్రమేయానాం సింధవే భక్తబంధవే |**
**గురూత్తమాయ మహతే మునయే నిత్యమంగళమ్ ||**

అంతు లేని గుణాలకు సముద్రంవంటివారు, భక్తుల విషయంలో ప్రీతిని కలవారైన మణవాళ మహామునులకు మంగళమ్

**15) అర్ణవాయ మహార్థానా మాశ్చర్యమతిసంపదే |**
**అభిరామమునీంద్రాయ గంభీరాయాస్తు మంగళమ్||**

గొప్ప గొప్ప అర్థాలకు సముద్రంవంటి ఆశ్చర్యకరమైన జ్ఞానసంపదను కల మణవాళ మహామునులకు మంగళమ్.

**16) వందే స్తౌమి నమామీతి క్రియాణాం ముఖ్యలక్ష్యతా |**
**యస్మిన్నేవ సమృద్ధాస్మై యమిశ్రేష్ఠాయ మంగళమ్ ||**

ప్రణమిల్లుతున్నాను, స్తుతిస్తున్నాను, నమస్కరిస్తున్నాను—అనే క్రియలకు ముఖ్యలక్ష్యభూతులైన మణవాళ మహామునులకు మంగళమ్.

**17) యచ్ఛృతే శఠజిత్సూక్తిసహస్రార్థాన్ శతోక్తితః |**
**యతీంద్రమతదీపాయ యతిశ్రేష్ఠాయ మంగళమ్ ||**

తిరువాయ్ మొழிనూత్తందాది ప్రబంధంద్వారా తిరువాయ్ మొழிప్రబంధంలోని వేయి పాశురాల అర్థాలను కృపజేసినవారు, భగవద్రామానుజ దర్శనానికి దీపంవంటివారైన మణవాళ మహామునులకు మంగళమ్.

**18) తీర్త్వా సంసారవారాశిం సిసేవిషుభి రచ్యుతమ్ |
సేవ్యాయ రమ్యజామాతృమునీంద్రాయాస్తు మంగళమ్ ||**

సంసారసాగరాన్ని దాటి, పరవాసుదేవుని సేవించాలనే ఆశను కలవారిచే సేవించదగినవారైన మణవాళ మహామునులకు మంగళమ్.

**19) ద్రవీభవతి యత్సూక్తిధ్యానేన హృదయం సతామ్ |
ద్రావిడామ్నాయభాగ్యాయ తస్మై ప్రాజ్ఞాయ మంగళమ్ ||**

తమ శ్రీసూక్తులను చింతించేవారి మనసును ద్రవీకరింజేసేవారు, ఆళ్వారుల సూక్తుల భాగ్యంవంటివారైన మణవాళ మహామునులకు మంగళమ్.

**20) ప్రళయేపి న లీయేత యన్మంత్రవిభవో భువి |
తస్మై ప్రఖ్యాతయశసే పుణ్యశ్లోకాయ మంగళమ్ ||**

ప్రళయసమయంలోకూడా నశించని వైభవాన్ని కల తనియన్ శ్లోకంతో స్తుతింపబడేవారు, లోకంలో అంతటా వ్యాపించిన కీర్తిని కలవారైన మణవాళ మహామునులకు మంగళమ్.

**21) వచోభూషణతత్త్వార్థవివృత్యోత్ఫుల్లకీర్తయే |**

**విదితాశేషవేద్యాయ వదాన్యాయాస్తు మంగళమ్ ||**

శ్రీవచనభూషణదివ్యశాస్త్రంలోని యథార్థతత్త్వాన్ని తెలిపే వ్యాఖ్యానాన్ని అనుగ్రహించి, వికసించిన కీర్తిని కలవారు, సర్వజ్ఞులు, పరమోదారులైన మణవాళ మహామునులకు మంగళమ్

**22) ణముధాత్వర్థనిష్ఠా యద్ధృదయే సుప్రతిష్ఠితా |**
**సర్వోత్తమాయ తస్మై స్యాత్సౌమ్యా చార్యాయ మంగళమ్ ||**

"ణము" ధాతువుయొక్క అర్థమైన ప్రహ్వీభావంలోని (వినయంగా ఉండడంలోని) నిష్ఠయే మనసులో స్థిరంగా కలిగిన (వినయశీలి అయిన) మణవాళ మహామునులకు మంగళమ్.

**23) వశిష్ఠాదిమహాయోగివచోభ్యోతిగరీయసీ |**
**వాచో దత్తవతే యోగవరేణ్యాయాస్తు మంగళమ్ ||**

వశిష్ఠాదిమహర్షుల వాక్కులకంటే చాలా గొప్పవైన సూక్తులను అనుగ్రహించిన మణవాళ మహామునులకు మంగళమ్.

**24) దేశికానా మశేషాణా మావేశోయం న సంశయః |**
**ఇత్యభిజ్ఞాభినంద్యాయ గురువర్యాయ మంగళమ్ ||**

ఆచార్యులందరు ఒకటిగా చేరి మణవాళ మహామునులై అవతరించారు–అని అభిజ్ఞులు పొగడే మణవాళ మహామునులకు మంగళమ్.

**25) రంధ్రాన్వేషిజనానా మప్యవద్యోక్తిదవీయసీ |**
**సూక్తిర్దత్తవతే సౌమ్యమునీంద్రాయాస్తు మంగళమ్ ||**

ఏ దోషం దొరుకుతుందా! అని సదా ఇతరులలో దోషాలనే వెదకి దూషించేవారి విషయంలోకూడా దూషణవాక్యాలను పలుకని చాలా సౌమ్యులైన మణవాళ మహాామునులకు మంగళమ్.

**26) యతిప్రవరభాష్యార్థభరితోక్తిప్రదాయినే |**
**యతిభి స్త్రిభిరీడ్యాయ.యతివర్యాయ మంగళమ్ ||**

శ్రీభాష్యార్థాలు నిండిన శ్రీసూక్తులను అనుగ్రహించేవారు, వానమామలై జీయర్, పట్టర్ పిరాన్ జీయర్, తిరువేంగడ రామానుజ జీయర్– అనే ముగ్గురు జీయరులచే స్తుతింపబడేవారైన మణవాళ మహాామునులకు మంగళమ్.

**27) జాగ్రద్దశాయా మాత్మీయదివ్యమంగళ విగ్రహమ్ |**
**ప్రదర్శితవతే మహ్యం ప్రాజ్ఞభోగ్యాయ మంగళమ్ ||**

కలలో కాక, మెలకువగా ఉండేటపుడే దాసునకు(నాకు) తమ దర్శనాన్ని అనుగ్రహించిన మణవాళ మహాామునులకు మంగళమ్

**28) మాయా దురత్యయేత్యేవం గీతాచార్యేణ కీర్తితమ్**
**మాయాం ధ్వస్తవతే సద్భి ర్మాననీయాయ మంగళమ్.**

"మమ మాయా దురత్యయా" అని గీతలో శ్రీకృష్ణుడు పలికిన మాయను (ప్రకృతిసంబంధాన్ని) పోగొట్టే మణవాళ మహామునులకు మంగళమ్.

**29) తత్త్వార్థం సర్వశాస్త్రాణాం హస్తామలకసన్నిభమ్ |**
**అవధార్యోచుషే విద్వదగ్రగణ్యాయ మంగళమ్ ||**

సర్వశాస్త్రాలలోని తత్త్వార్థాలను కరతలామలకంవలె దర్శించి, ఏ సందేహం కలుగని విధంగా ఉపదేశించే మణవాళ మహామునులకు మంగళమ్.

**30) రంజితాశేషచిత్తాయ భంజితధ్వాంతరాశయే |**
**మంజువాణీవిలాసాయ మునీంద్రాయాస్తు మంగళమ్ ||**

అందరి మనసులను రంజింపజేసేవారు, అజ్ఞానాన్ని పోగొట్టేవారు, అందమైన వాక్కులను పలికేవారైన మణవాళ మహామునులకు మంగళమ్.

**31) ముఖపంకజనిర్గచ్ఛన్మధుసోదరసూక్తిభిః |**
**ముముక్షూన్ రక్షతే నిత్యం మునివర్యాయ మంగళమ్ ||**

తమ పద్మంవంటి ముఖంనుండి వెలువడే తేనెవంటి సూక్తులతో ముముక్షువులను రక్షించే మణవాళ మహామునులకు మంగళమ్.

**32) నిత్యకైంకర్యనిష్ణాతశేషావతరణాత్మనే |**
**మునయే రమ్యజామాత్రే నిత్యశ్రీః నిత్యమంగళమ్ ||**

నిత్యం భగవత్కైంకర్యనిరతులైన ఆదిశేషుల అంశతో అవతరించిన మణవాళ మహామునులకు సదా మంగళమ్.

**మంగళాశాసనం శ్రీమద్వరయోగి గుణోజ్జ్వలమ్ |**
**నిధ్యాయతాం సతా మస్తు నిత్యశ్రీః నిత్యమంగళమ్ ||**

మణవాళ మహామునుల కల్యాణగుణాలు ప్లకాశించే ఈ మంగళాశాసనస్తోత్రాన్ని అనుసంధించేవారికి నిత్యశ్రీః, నిత్యమంగళమ్.

---------శ్రీశైలేశదయాపాత్రమంగళాశాసనస్తుతి సంపూర్ణమ్----------




మహావిద్వాన్, పద్మవిభూషణ, జగదాచార్య సింహాసనాధిపతి,
ఉ.వే.శ్రీమాన్ ప్రతివాదిభయంకరం అణ్ణంగరాచార్య స్వామి వారు